The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

తూప్రబజారు, హైద్రాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపఁబడును

| | | |
|---|---|---|
| సం॥చందా రూ ౬-౦-౦<br>అర్థ ,, ,, ౩-౦-౦<br>విడి ప్రతిక ౦-౧-౦ | **GOLKONDA PATRIKA**<br>HYDERABAD, Dn.) THURSDAY 21-2-1935<br>103589 | ప్రాతపత్రికకు<br>వెల ప్రత్యేకము |

సంపుటము ౯ } శా.శ. ౧౮౫౬ శ్రీభావనామసం॥ మాఘ బ॥ ౩ గురువారము ౧౯-౫-౪౪ ఫ. { సంచిక ౭౫

## ఖద్దరు ఏల ధరింపవలెను

జానపాటి సత్యనారాయణ గారు

ప్రపంచమునందలి వివిధ దేశములను హిందూ దేశముతో పోల్చిచూచిన అన్ని దేశములకన్న హిందూ దేశము కడు దరిద్రత అనుభవించుచున్నది. హిందూ దేశీయులు ఆరు కోట్లమంది ఒంటిపూట భోజనముకూడ లేకుండ యున్నారను విషాద విషయము మరే దేశమునందునూ లేదు.

దరిద్రత

కు కారణమేమి? ఇతర దేశములు స్వాతంత్రశకలిగి పరిశ్రమలచే భోగభాగ్యము లనుభవించుచున్నవి. విదేశీయులు తమతమ దేశములందు తయారగు వస్త్రవాహనములను అన్యదేశములకు ఎగుమతి చేసి లాభములు సంపాదించి జీవించుచున్నారు. హిందూదేశమున్న ప్రతినిత్యయోపయోగ వస్తువులను దిగుమతిచేసుకొనుటయేగాని యెన్నదగిన ఎగుమతి ఒక్కటైనప్పు మరియొకండులేదు. అయ్యదేదియన కోట్లకొలదివిలువగల వెండి, బంగారములు హిందూదేశ దరిద్రతకు యింతకన్న మరొండు కారణమేమి కావలెను?

ఇట్టిదుస్థితికి ప్రభుత్వము కారణమైనను, ప్రజల అలసట, సోమరితనముకూడ కారణములని మనవకూడదు. ఈ దేశపరిస్థితులను చక్కగా గ్రహించిన

గాంధిమహాత్ముడు

నాయకత్వము వహించిన నాటినుండియు, దేశముయొక్క ఆర్థికపరిస్థితులు బాగుపడినగాని, మరెట్టి అభివృద్ధియు కలుగనేరదని గ్రహించి వెంటనే గృహపరిశ్రమల నుద్ధరింప బద్ధకంకణుడయ్యెను. హిందూదేశము తనబట్టకు, పొట్టకు ఇతరదేశములపై యాధారపడియుండు నంతవరకు దేశసౌభాగ్యము కలుగదని గ్రహించెను. పరిశ్రమలలోకెల్ల ముఖ్యపరిశ్రమయగు వస్త్రఉత్పత్తిని చేపట్టెను. పురాతనరాట్నము నుద్ధరించినగాని సామాన్య జనులకు జీవనోపాధి కలుగదని గ్రహించి

రాట్నము

బీదలపాలిటి కల్పతరువనియు, స్వాతంత్ర్యప్రియులకు ముఖ్యచిహ్నమనియు బోధించినాడు. రాట్నము కనిపెట్టుటచే తాను వర్తమానఆర్థికవేత్తలందరికన్న మిన్నయని ప్రకటించుకొనవచ్చునని తెల్పుచున్నాడు. ఆ మహామహుడు అంతగొప్పగా చెప్పుకొనుట రాట్నపరిశ్రమ నవీనయంత్రయుగమునకు పనికిరాదనియు, యంత్రములపోటీకి ఆగజాలదనియు, హిందూదేశమునకు కావలసిన వస్త్రములను రాట్నము తయారుచేయలేదనియు రాట్నముపై పనిచేయువారికి కూలి గిట్టుబాటు కాదనియు మొదలగు వింతకారణములను శాస్త్రవిద్యాప్రవీణులు నుడువుచున్నారు. వారిఆక్షేపణల నొక్కొక్కదానిని విచారింతము వారి మొదటియాక్షేపణ

మిల్లుల

పోటీకి రాట్నము ఆగజాలదనునది. గాని నేటి ఆర్థిక దుస్థితికి యంత్రములే ముఖ్యకారణములని నాతలంపు.

1 వస్త్రములుతయారుచేయు ఒకయంత్రమును సమగ్రముగా సమర్పి వస్త్రములుతయారు చేయుటకు లక్షలకొలది పెట్టుబడి కావలెను.

అందులకు పెట్టుబడిదారుడు కావలెను. మనముధరించు వస్త్రములకు ఆయంత్రము అనుర్పబడి పనిచేయుచున్న ప్రాంతజనులు ఆపెట్టుబడిదారుని దయాదాక్షిణ్యములకు లోబడవలెను. అనగా మనము ప్రజాజనులమై మనవస్త్రములు మనము తయారు చేసుకొనలేని స్థితినిగ్రహించిన పెట్టుబడిదారు రూపాయివిలువగలిగిన వస్త్రమును నాలుగురూపాయల కమ్మినను వేరుగతిలేనందున తీసుకొనవలసియుండును. ఒకవేళఏకారణముచేతనైనను తనయంత్రాలయమును మూసివేసిన ఆప్రాంతములకు మానభంగముతప్ప వేరు మార్గములేదుకదా! అటులనుటలో మరొకచోట నుంచి తెప్పించుకొనగూడదాయను ప్రశ్న యుదయించవచ్చును. అందుకు సమాధానము మరొక ప్రాంతమువారు ఈయంత్రమువని చేయుటలేదనియు, ఆప్రాంతములవారు వస్త్రములకొరకు అక్కరకలిగియున్నారనియు గ్రహించి ధరహెచ్చించినగత్యంతరమేమి? ఇందులకు నిదర్శనము జర్మనీయుద్ధమునందు పెట్టుబడిదారులగు ధనవంతులు అవకాశము దొరకగొని వెలలుహెచ్చించిన విషయము దేశీయులకు తెలియనిదికాదు.

దీనివలన మనముగ్రహించవలసిన దేమనగా సంఘము ఎప్పుడును పెట్టుబడిదారులగు కొందరువ్యక్తులపై ఆధారపడుట ప్రమాదము విషయము.

రాట్నము ఈసమస్యనెటుల పరిష్కరించుకొనునో గమనింపుడు. మొట్టమొదటిసంగతి దానికిదారగు పెట్టుబడిదారుడుండుటలేదు. ప్రతికుగ్రామములోను రాట్నములుగలవు. హిందూదేశమునందు నూటికి ఎనుబదిమంది వ్యవసాయదారులు వారుపండించు ఇతరపంటలతోబాటు కొంతభూమిలో ప్రత్తిపండించుకొనవచ్చును. ఆప్రత్తిని తినయింటియందే తీరికసమయములందు గింజల సహాయముతో ప్రత్తిలోనిగింజలువిడదీసి దూదిచేసుకొనవచ్చును. ప్రత్తిలోనిగింజలు పశువులకు పయోగించును. దూదిని గ్రామములోని దూదేకులవానిచేత ఏకించి ప్రతిఫలముగా తనపండించినవానిలో దేనినైనయివ్వవచ్చును. ఎండకాలము నందువ్యవసాయదారులకు పని యుండదుకదా? చల్లగా నీడపులోనికూర్చుండ యింటియందు హాయిగా రాట్నమువడకుకొని నూలుతయారుచేసుకొనవచ్చును. అట్లుతయారైననూలును తన గ్రామమునందేయున్న సాలెవాండ్రచే నేయించుకొనవచ్చును.

ఈప్రకారంము నూటికర౹౯మంది వ్యవసాయదారులైన భారతభూమి వారు తీరికసమయముగు ఎండకాలమందు తయారుచేసిన నూలుతో వారికికావలసిన వస్త్రములనేకాక వారిపైఆధారపడియున్న నవనాగరికులమని విఱ్ఱవీగుపట్టణవాసులకు [illegible] మందికి కావలసినవస్త్రములనుకూడ సప్లైచేయగలదను విషయముప్రతిసామాన్యుడు గ్రహించగలడు.

గ్రామమునందలి పేదరైతుకు, పేదసాలెవానికి దూదేకులవానికి జీవనోపాధికలుగుచున్నది. పరస్పరసహకారమువలనస్నేహబంధముగా ఘముగానల్లుకొనును సోమరితనముదూరమగును.

యంత్ర పరిశ్రమయందుగల విషయములలోపెట్టుబడిదారులవిషయము తెల్పిరాట్నపరిశ్రమవలనలాభమునుచెప్పితిని. ఇంకపెట్టుబడిధనమునుగూర్చిచెప్పెదను.

2 ఒకయంత్రమును సమగ్రముగా నమర్చవలసిన కొన్నిలక్షల ద్రవ్యము కావలసియుండునని ముందేతెల్పితినికదా? ఈయంత్రములు హిందూదేశమందు తయారగుటలేదు. ఇంగ్లండు, జర్మనీ మొదలగు విదేశీయులుతయారుచేయుచున్నారు. లక్షలకొలదివెండిబంగారమును విదేశములకంపి,దరిద్రచిహ్నమగుయినుమును దిగుమతిచేసుకొన్నాము.స్వదేశీయులుమనవెండిబంగారముతోధనవంతులగుచున్నారు. మనముదిగుమతిచేసుకొన్నయినుపసామానుచెడినచిల్లిగవ్వవిలువచేయదుకదా! హిందూదేశము నాగరికతయనివిఱ్ఱవీగుచూదిగుమతిచేసుకొన్న బియ్యపుమరలు, పిండిమరలు, ఆవిరి, విద్యుద్యంత్రములు [Electro] వస్త్రములతయారుచేయు యంత్రములు వేయేల చివరకు వడ్రంగినోట మన్నుకొట్టిన మరనాగళ్లు మొదలగుయినుపవస్తుమయమగుచున్న హిందూదేశము ఇట్టిదరిద్రస్థితిలోగాక మరెట్లుండును?

రాట్నపరిశ్రమ ఈప్రశ్నకుయేమిజవాబు చెప్పునోవిచారింతము? ఈపరిశ్రమకు పెట్టుబడిదారులేనందున పెట్టుబడిఅక్కరయేలేదనుట అతివిశదమేకదా! ఈపరిశ్రమకుకావలసిన పరికరములురాట్నము. మగ్గము, గిలక మొదలగుకొయ్యసామానులు ఈకొయ్య హిందూదేశమునందే విస్తారముగాలభించును. విదేశములకు వీటినిమిత్తముఒక్కచిల్లిగవ్వపంపపనిలేదు. ఈపరికరములు తయారుచేయు వడ్రంగులు ప్రతిగ్రామమునందు యున్నారు.బీదవారలగువీరికి జీవనోపాధికలుగును.ఈసామానుసామాన్యముగా యిరువదిసంవత్సరములు నిరాటంకముగా పనిచేయును. అప్పుడువీటినివంటచెరుకుగా యుపయోగించుకొనవచ్చును. గాలినబూడిద ఎరువుగాయుపయోగించును. ఈప్రకారందేశంలోని ధనముదేశమునందే యుండును. బీదలకుపనికలుగును. పెట్టుబడిద్రవ్యవిషయమై పైరెండుపరిశ్రమలకు గలభేదమును తెల్పితిని.

3 యంత్రపరిశ్రమలు గ్రామములోయేర్పాటుచేయుటకువీలులేదు. పెద్దపట్టణములయందుయంత్రములు అమర్చిసాగించుచున్నారు. పెట్టుబడిదారులుతమ సౌకర్యములనిమిత్తము యంత్రములయందు తయారగు వస్త్రములవిక్రయము నిమిత్తం, రైల్వేసౌకర్యములనిమిత్తం పట్టణములయందుండుట అనివార్యముగా తలంపబడుచున్నది.

కానిఈయంత్రములయందుపనిచేసి పెట్టుబడిదారు ధనాగారములనింపవలసినది పల్లెటూరిప్రజలు అభముశుభముయెరుగని గ్రామవాసులు హెచ్చుకూలిలభించునను వ్యామోహమునకులోనై పట్టణములకు ఆకర్షింపబడుచున్నారు.

హెచ్చుకూలిలాభముఉన్నదను విషయము ఒకింతసేపు యోచించిననూ నష్టములచూడుడు బొంబాయి, అహమ్మదాబాదులవంటి పెద్దపట్టణములలో గ్రామవాసియగుఈకూలి తనకుటుంబంతోనివసించలేడు. ఖర్చులనుభరింపలేడు. అందువలనతనభార్యాపిల్లలను యింటవదలి తానొక్కడే పట్టణమందు ద్రవ్యార్జనతలంపుతో వెడలుచున్నాడు. మొదటిలాభముభార్యాపుత్ర వియోగము. విద్యాగంధశూన్యులగు ఈపాటకజనులువేలకొలది పెద్దపట్టణములయందలికూలీలగుచున్నారుకదా? ఇట్టిపాటకజనుల అనువు ఆజ్ఞలలోనుంచువారెవరు? ఈకారణముకలహములు అశాంతి యేర్పడుచున్నవి.

ఇయ్యదిరెండవ లాభము.

ఇకమూడవలాభమును గమనించుడు. గ్రామములోనివసించు చున్నభార్యకునేడు. పట్టణములోని కూలిపనిచేసి సంపాదించి తినుట నిరాదరించిన భర్తకుభార్యకులేదు. గ్రామమునందలిభార్య,పట్టణమునందలిభర్త, కామాతురులై, కానిపనులుచేసి, సంఘమునుహీనస్థితికి తెచ్చుచున్నారు. ఈపాటకజనులు తనకుటుంబములతో యుండజాలనికారణముచేతనే కేళీగృహములు (వేశ్యవాటికలు), పానశాలలు (త్రాగుడు విక్రయశాలలు). పట్టణమునందు లెక్కకుమిక్కిలి. ఈమర్మరవిషయమును యోచించినకొద్ది హృదయముదుఃఖపూరితమగుచున్నది.

నేడునాగరకతయను, పేర, ఆమాయకులు గ్రామవాసులునగు పాటకజనులెన్నికుటుంబములు నాశనమగుచున్నవో ఒక్కింత యోచించిన తెలియగలదు. స్వేచ్ఛగా, ఆనందముగాతనయింట తాను రాజువలె ఉన్నదానితోతృప్తిచెంది స్వసంఘమునందు గౌరవమర్యాదలతో జీవించుగ్రామవాసిఎటులపరిణమించినదో! ఇయ్యదియంతయు ఈయంత్రములు మహాత్మ్యము గాకమరొండుకారణముకలదా!

ఇకరాట్నపరిశ్రమవలనలాభమును చూడుడు. గ్రామవాసులు తమగ్రామమునుంచి కదలనక్కరలేదు. తనయింటసుఖముగా భార్యాపిల్లలతోకలసి ఆనందముగా కష్టముచేసుకొని జీవించవచ్చును. నేతనేయుసాలెవాడు. దూదిపకుదూదేకులవాడు, రాట్నమువడుకు ముసలమ్మతమతమయిండ్లలలో ఈరాట్నయంత్ర మహాత్మ్యమును గానమొనర్చుచూ, స్వేచ్ఛగా, హాయిగా, కాలముగడుపవచ్చును. హిందూమహమ్మదీయుల కలహములుండవు. సంఘకట్టుబాట్లకుభయపడిదురాచారదూరులైయుందురు. నేడుయిట్టి వస్త్రపరిశ్రమవంటి గృహపరిశ్రమలేకనేగదా పరిస్థితులు తారుమారై గ్రామములపై ఆధారపడవలసిన పట్టణవాసులు పాశ్చాత్యనాగరకతామోహితులై గ్రామబునాదుల మొదలంటపెకలించివైచి గ్రామవాసులజీవనము దుర్భరముగానొనర్చి, పశుప్రాయులగా జేసివైచి, నేటి హీనస్థితికి కారణభూతులైరి.

నాల్గవ నష్టమునుతెల్పెదను. హిందూదేశమునందలి ముఖ్యవృత్తి వ్యవసాయముఅని తెల్పియుంటిని. మనదేశముపాడిపంటలతో సలరారుచున్నందువనే దీనికిరత్నగర్భయను పేరువచ్చినది. ఇయ్యదితననిత్యజీవనమునకు ఇతరులపైఆధారపడవలసినపనిలేదు. తానతినిన్నియితరులకు పెట్టగలిగియున్నది.

కానిఇంగ్లండువంటి ఇతరదేశములటుల కాదు పాడిపంటలుతక్కువ అందువలన, హిందూదేశమువంటి ఇతరదేశములపై నాధారపడవలసియున్నది. ఆంగ్లేయులు హిందూదేశమును తమ కాలిక్రిందఅణచిపెట్టియుంచుకొనిన కారణము రాజ్యకాంక్ష ఎంతమాత్రముకాదు తాను తయారుచేయు నిష్ప్రయోజకవస్తుసామగ్రిని అంగడిసామగ్రికి అంగడిస్థలమనునది ముఖ్యకారణము.

వారుప్రతియేట సిగరెట్లు, గాజుపెంకులు, యినుపముక్కలు, రబ్బరుసామానులుమొదలగునిష్ప్రయోజకవస్తువులనుహిందూదేశమునకు అక్కరయున్నా లేకున్నా నవనాగరకతయనుపేరమోహితులజేసియో, అధికారశక్త్యా బెదరించియో, దిగుమతిచేసి ఇందులకు ప్రతిఫలముగా భోజనపదార్థములను, వెండిబంగారములను, తీసుకొనిసుఖపడుచున్నారు. మనముదిగుమతి చేసుకొనుచున్న వస్తుజాలమువలన మనమెట్టిస్థితికివచ్చినది పాఠకమహాశయు తెలుపంగనిదికాదు.

ఇట్టి నిష్ప్రయోజక వస్తుజాలములోచేరిన యంత్రములను యినుపముక్కలు ఒక్కహిందూదేశమునేగాక ప్రపంచమునంతయు తారుమారుచేసినది. అదెట్లు? వివరించెదచూడుడు.

యంత్రనిర్మాణమునకు పూర్వము వృత్తివిభజనయుండెడిది. వడ్రంగులు, బియ్యముదంపువారు, గానుగద్రిప్పువారు, సామానుల ఒకస్థలమునుంచి మరొకస్థలమునకు తీసుకొనిపోవువారు చాకలివారు, నేయువారు, వ్యవసాయముచేయువారు, శిల్పిచాతుర్యధురీణులు, గాయకులు మొదలగు వివిధవృత్తులవారు జీవించుచుండిరి.

ఇందుకు ఒకవుదాహరణవినుడు. ఒకగ్రామముకలదు అందు ౨౦౦౦ వేలజనులు కలరనుకొందము ఆ ౨౦౦౦ జనులకు రోజుకుభోజనము నిమిత్తము సగటున ౨౦పల్లాలబియ్యము కావలసియుండును. ఆ ౨౦ పల్లాలబియ్యం తయారుచేయుటకు నూరుమందికూలివారు అర్ధపక్షము కావలసియుండును. అనగా ఒకగ్రామమునందు ఒక్కదంపుడువృత్తిచే నూరుమందికి జీవనాధారముకలుగుచున్నది. ఈప్రకారం యిరువైగ్రామములలో రెండువేలజనులకు ప్రతినిత్యముజీవనాధారముగాయున్నది.

కాని నేడు ఒక్కబియ్యపు యంత్రము (Rice Mill) ఈపదిగ్రామములవారికి కావలసినబియ్యము పదిమందిమనుష్యుల సహాయముతో తయారుచేయుచున్నవి. దీనివలనపదిగ్రామములలోని దంపుడుచేజీవించుచున్న రెండువేలప్రజలలో ఒకవెయ్యితొమ్మిదివందలతొంబదిమంది జీవనాధారశూన్యులైరి!

ఈప్రకారం హిందూదేశమునందు గృహపరిశ్రమలచే జీవించువారికి కోటమట్టిగొట్టి, యంత్రములు కోట్లకొలదిజనుల వృత్తిశూన్యులచేసి, పెట్టుబడిదారులకు లాభకారులై నిరుద్యోగసమస్యను లేవదీసినది. వృత్తివిభజన(Labour distbi- bution ] మంటగలసినకారణమున దేశమునందలిధనము పెట్టుబడిదారులగు స్వల్పసంఖ్యాకులలో రక్తై అసంఖ్యాకజనులను అన్నమో రామచంద్రా యనుగతితెచ్చిపెట్టినది. మరియు, ధనవంతుల [Imperialist] పడిపంచల దయాదాక్షిణ్యములకులోబడునట్లుజేసి దాస్యమునుఅంటగట్టుటయే గాక విపరీతబుద్ధులుగల ఆర్థికవేత్తలచేతయారుచే యుచున్నది. దేశ దారిద్ర్యమునకు వింతకారణ

(౯ వ పేజి చూడుడు)

గోలకొండ పత్రిక
శ్రీభావనామ సం॥ మాఘ బ॥ 3
గురువారము

# సెకండరీవిద్య

ఇదివరలో మేము సెకండరీవిద్యను గురించి కొంత చర్చించియుంటిమి. ఈవిద్య చాల ముఖ్యమగుటచే మరికొంత వ్రాయ నవసరమయ్యెను. ఇదివరలో సెకండరీ పాఠశాలలో ప్రధానవిద్యాపద్ధతి మాతృభాషామూలమున నుండవలెనని నిరూపించియుంటిమి. ప్రైమరీ శాఖలో విద్య మాతృభాషలోనే యుండవలెనని యొప్పుకొనువారు సహజముగా సెకండరీలోకూడ విద్య మాతృభాషలోనే యుండవలెనని యొప్పుకొనవలసివచ్చును. ఏలన ప్రైమరీలో ఉర్దూయొక్క కాని ఆంగ్లముయొక్కగాని వాసనయే లేని విద్యార్థి లెటాలున ౬ వ తరగతి ( ఇప్పటి ౧ వ ఫారము ) లోనికి వచ్చిన వెంటనే తన మాతృభాషను వదలి ఉర్దూలోగాని ఇంగ్లీషులోగాని పాఠములన్నియు నెట్లు చదువునో యెవరైన నిరూపించగలరా? చరిత్ర, భూగోళము, లెక్కలు, సైన్సు, వాచకములు మున్నగునవి ౬ వ తరగతిలో ఉర్దూలోగాని, ఇంగ్లీషులోగాని యెట్లు విద్యార్థులు చదువగలరు? ఎట్లు అర్థము చేసికొనగలరు? కావున ప్రధానపాఠములన్నియు మాతృభాషలోనే యుండవలసి వచ్చును.

డా॥ మెకంజీగారి యభిప్రాయము కూడ నిదియే. అదియే సమంజసమైనది. ఖస్బాసెకండరీశాఖలో ఇంగ్లీషుభాషను బలవంతపు ద్వితీయభాషగా నుంచుటకై వారు సూచించినారు. అట్లు చేసినచో మూడేండ్ల సెకండరీవిద్య పూర్తియగువరకు, విద్యార్థి యీ మూడేండ్లలో ఇంగ్లీషులో కొంత కొంత జ్ఞానము సంపాదించును. అటుతర్వాత ఇంగ్లీషులో పాఠములు హెచ్చించుచు మాతృభాషలో తగ్గించుచు వచ్చిన విద్యార్థికి కష్టమేమియు నుండదు.

డా॥ మెకంజీగారు సెకండరీశాఖలో రెండు భాగములు చేసినారని చెప్పియున్నాము. ఒకశాఖ గ్రామశాఖ, రెండవది ఖస్బాశాఖ. గ్రామశాఖలో పూర్తిగా వ్యవసాయవిద్యను మాతృభాషాద్వారా నేర్పించుట వారియభిప్రాయముగా నున్నట్లున్నది. అది మంచిదే కాని విద్యార్థి సెకండరీశాఖను పూర్తిచేసి తర్వాత పై తరగతులలో [౬ నుండి ౧౧ వరకు] చదువ దలచిన, ఆ పైతరగతులలో ఉర్దూగాని, ఇంగ్లీషుగాని లేక రెండునుగాని ప్రధానభాషలైన యెట్లు అను ప్రశ్న బయలుదేరును. దీనికి సమాధానము డాక్టరుగారిట్లు చెప్పినారు గ్రామశాఖవారికి పైతరగతులకై ఇంగ్లీషులో ప్రత్యేకముగా కొంతకాలము తర్ఫీదు చేయవలెను అని చెప్పినారు కాని మాయభిప్రాయ మిందుకు భిన్నము. సెకండరీ గ్రామశాఖ విద్యార్థి సెకండరీతో తనవిద్య పూర్తి చేసికొని చాలించుకొనదలచిన నతనికిఇంగ్లీషుగాని ఉర్దూగాని ప్రత్యేకముగా చెప్పించుశ్రమఅవసరమే యుండదు. కాని పైతరగతులలో చదువగోరువారికి స్పెషల్ తర్ఫీయతు చేయుటవలన కాలహరణం, శ్రమ కలుగక మానవు. కావున మా సూచన ప్రకారము గ్రామశాఖలో విద్యార్థికి ఇంగ్లీషును స్వేచ్ఛా ద్వితీయ భాషగా [optional] నుంచవలెను.

ఇంకొక విషయముగమనింప దగినదేమన, గ్రామశాఖలో కేవలము వ్యవసాయ విద్యయే చెప్పించుటవలన లాభములేదు. మన రాష్ట్రములో గ్రామజనులే విశేష మనుమాట మరువ కూడదు. ఇతర దేశములలో నట్లుకాదుచూడుడు.

| దేశము | గ్రామజనులు నూటికి |
| --- | --- |
| నిజాంరాష్ట్రము | ౮౮౪ కంటె యెక్కువ మంది |
| హిందూస్థానము | ౮౭ |
| ఫ్రాన్సు | ౫౮ |
| జర్మనీ | ౫౬౪ |
| అమెరికా | ౪౯ |
| ఇంగ్లాండు | ౨౧ |

కాని గ్రామజనులందరును వ్యవసాయము పైననే ఆధారముపడినవారు కారు. మన రాష్ట్రములోను బ్రిటిషిండియాలోను జనుల వృత్తులీవిధముగానున్నవి.

| | | మనరాష్ట్రములో | బ్రిటిషిండియాలో |
| --- | --- | --- | --- |
| వ్యవసాయము | నూటికి | ౭౭ | ౭౪౪ |
| పరిశ్రమలు | ,, | ౫౭ | ౧౦ |
| వ్యాపారము | ,, | ౬ | ౫౪ |

కావున కేవలము వ్యవసాయము వలన లాభములేదు. నూటికి ౭౭ మంది వ్యవసాయముపై నాధారపడిన వారనిచెప్పినను, వీరిలో నందఱును స్వయముగా భూమిగల్గి సేద్యము చేయువారు కారు. అట్టివారలు నూటికి ౮ మంది మాత్రమే. తక్కిన నూటికి ౧౮ మందిలో కౌలుదారులు, పాలివారు, వ్యవసాయ నౌకరులు ఉన్నారు. మరియు, అనేక గ్రామములలో నూటికి సగమువంతు యితరవృత్తులపై నాధారపడినారు. కావున వ్యవసాయవిద్య ప్రధానముగా నిచ్చుచు, పరిశ్రమవిద్యయు గ్రామశాఖలో నిచ్చుట యవసరము.

ఖస్బాశాఖలో వ్యవసాయముతోనంతగా నవసరములేదు. పరిశ్రమలు, వ్యాపారము ముఖ్యముగా బోధింపవలెను. మన రాష్ట్రములో నానా ప్రాంతములలో నానావిధములగు పరిశ్రమలు కలవు. బీద్రీ సామానులు, వరంగల్ తివాసీలు, అలంపూరు జమఖానాలు, నారాయణపేటచీరలు పెంబర్తి వెండి యిత్తడిపనులు, ఔరంగాబాదు కాగితములు, ఇట్టివెన్నియో కలవు. కొన్నితావులలో నేతమగ్గములు విశేషముగా నుండెను. గద్వాల ప్రాచీనమందు ఈ రాష్ట్రమునకే కాక బ్రిటిషిండియాకు సహితము నేతబట్టలను పంపుచుండెను. కాని అక్కడి ప్రభువులు మిల్లు విదేశ బట్టలపై వ్యామోహము కలిగిన నాటనుండి, యనేక స్థలములందు మగ్గములు మూలపడి క్రమేణ వంటకట్టెలక్రింది కుపయోగపడెను.

మన రాష్ట్రములో అడవులు చాలకలవు ముడిపదార్థము కలదు. నేలబొగ్గుకలదు. నదులు కలవు ఇట్టిప్రకృతిని సరియైన మార్గమున నుపయోగములోనికివశీకరణముచేసిన, కొంతకాలములోపల రాష్ట్రమువారికి ఒయటనుండి సకలవస్తువులు తెప్పించుకొనవలసిన యవసరముండదు. కావున విద్యాశాఖవారు ఏప్రాంతములలో నేయే పరిశ్రమలు కలవో అట్టివానికి ప్రోత్సాహమగు పద్ధతిపై పారిశ్రామిక విద్య చెప్పించు యేర్పాట్లు చేయవలెను.

## మంగలివారు కులీనబ్రాహ్మణులు అగుట

(విశేషరి)

జాలంధర్ కులీనబ్రాహ్మణుల పౌర్యదర్శివలన మాకు తెలియుచున్న సంగతి యేమనగా యిదివరకు మంగలి శ్రీమంసిరిమంగలి అనివాడుకొనుచుకనక ఇట్లు పరిచేసెదాగుండును. గలి, కొండమంగలి నాయి బార్బర్ పేరుగల వారలను ప్రతిపాఠశాలలో చేర్చుకున్నప్పుడు రిజిష్టర్ లో మంగలివారల వానికులము కులీనబ్రాహ్మణునిగా వ్రాయుటకు యిండియా గవర్నమెంటువారిని మరియు నిజాముగవర్నమెంటువారిని కోరుకొనగావారు తమతమ సంబంధముగల కచేరీలకు గష్తీలు జారీచేసినారని. మంగలి, నాయి, బార్బర్ పిల్లలను పాఠశాలలో చేర్చుకొన్నప్పుడు వారికులము కులీనబ్రాహ్మణునిగా వేర్చుకొన బడగలదని తెలియుచున్నది

## నగరపోలీసుల స్పోర్ట్సులు

౨౦ ఫర్వర్ది ౧౩౪౪ ఫ సోమవారము సాయంకాలము ౩౪ గంటలనుండి ౬౪ గంటలవరకు పబ్లికుగార్డెన్సులో నగరపోలీసుల స్పోర్ట్సుల జరుగును అపుడధ్యక్షులు నగరకొత్వాలు అగు నవాబ్ రహమత్ యార్జంగ్ బహద్దర్ గారును నగరపోలీసు అధికారులను సాయంకాలము ౪ గంటలను ఆట్ హోం జరుగును

## తహసీల్దారు జేబులో దొంగతనము

౧౫ ఫర్వర్ది ౧౩౪౪ పాలు హైదరాబాదు దక్కన్ — ఉపకారవేతనము పొందుచున్న హైదరాబాదునివాసులగు మౌల్వీ మహమ్మద్ జాఫర్ సా॥ తహసీల్ దారుగారు యాత్రార్థమై వాల్ తుపోవుటకై బొంబాయి వెళ్లియుండిరి. వీరితమవద్ద కొంతధనము ఉంచుకొనిరి యొండర్ లెండ్ బ్యాంకులో అయిమారకము చేయుటకై తనమీదిజేబులో డబ్బడిఅయిను ఉంచుకొనిరి ఎవరో చేయి బొబ్బపెట్టి కాజేసినారని అనుకొన బడుచున్నది.

## కుళ్లినమాంసము, నరములు దొరకుట

హైదరాబాదు (దక్కన్), ౧౮-౫-౧౩౪౪ — ఫర్బనినుండి ఒకసమాచారమిట్లు తెలియుచున్నది. వర్ తాలాకి వార్ లో ఒక పొలములో కొన్ని రొట్టెలు దొరికినవి కలము మిక్కిలి కుళ్లిపోయిన నరము లతోటి మాంసరక్తము మొక్కలుగల దుప్పటఒకటి రక్తసిక్తమైన రెండుదోతులు ఒకఆట్ట రక్తసాయమైన రుమాలుదొరికినవి రక్షకశాఖవారు కత్తితో పొడిచిచంపి పీనుగలను పరగ్రామమునుండి బండిలో తెచ్చి యిక్కడ పారవేసిపోయినట్లు అనుమానించుచున్నారు.

## ప్రకటన

కరోడ్గిరి విషయమైన ప్రకటన ఆర్థికశాఖవారిఆజ్ఞ మెదలగుమరికొన్ని ప్రభుత్వవార్తలు యిపుడు స్థలములేనందున యీవారప్రకటించబడును.

### కృతజ్ఞత.

గతసంచికలో "హైదరాబాదు విద్యాసంస్కరణ విచారణ ఉపసంఘము" అను శీర్షిక క్రింద వ్రాయబడినవార్త హైదరాబాదుబులెటిన్ పత్రికనుండి కృతజ్ఞతతో గ్రహింపబడినదని పాఠకులుగ్రహింతురుగాక.



## మాఫీలకై మః ఘః వః గారికి కృతజ్ఞత

(ఇష్టం)

సభకై తాలూక్దారుగారిని అనుమతివేడుట

ఈసారి అబీ ఖరీపుకిస్తీలలో రూపాయ ౧కి రెండణాల వంతుల మాఫీదయచేసినందుకు మ ఘ వ నిజాం ప్రభువుగారికి కృతజ్ఞత దెల్పుటకై సభచేయదలచిన ఒకరినుండి వరంగల్లుతాలూక్దారుగారికి యీక్రిందిదరఖాస్తు పంపబడినది.

బనలీభువనుమజవాబ్ వరంగల్ మండలాధిపలగారి దివ్యసన్నిధిలోకి

కృతజ్ఞతాపూర్వక వందనానంతరం ఆయ్యా,

మాదేలికయను మ ఘ వ నిజాం ప్రభువరేణ్యులు మాకౌతుల ఆర్థికదుస్థితిని గమనించి, అబీలాను ఖరీఫులోను రూపాయకు ర్యేండాలమాఫు యిచ్చిమా ఆర్థికదుస్థితిని సాధ్యమైనంతవరకు తొలగించుచున్నందులకు మా ప్రభువుగారికి కృతజ్ఞతాపూర్వక వందనము అర్పించుటకై ఖమ్మంతాలూకాలో చేరిన పెదవీరపల్లి శివారు జానకీపురమందు శాకబహిరంగసభ ౨౫ ౧౧ అర్డిబెహెస్తు స్న ౧౩౪౪ ఫసలీన చేయదలచినాము కను కదయచేసి దేవరవారుత్వరలో ఉత్తర్వుప్రసాదింప ప్రార్థన.

చ ౧౨ పరవర్డి స్న ౧౩౪౪ ఫసలీ.

ఇట్లు
విధేయుడు
పాటిబండ్ల రఘుపతిరావు.

---

### వలియొద్ దౌలా బహదర్ గారిహజ్

హజ్ యాత్రికలను గొనిపోవుఓడ బొంబాయినుండి తే ౧౯ ఫిబ్రవరినాడు వెడలినది ఇందులో నవాబువలీయొద్దౌలాబహద్దరు గారు తమకరితో సహా వెళ్లినారు ఇసామియాజహాజుపై ఓడతర్వాత వెళ్లినదని తెలియుచున్నది వలీయొద్దౌలాగారు మొదటమదీనాకుపోయి చేరితిరిగి హజ్ ప్రయాణల గుగురని తెలియుచున్నది

---

## రైల్వే కూలిపనివాండ్రసభ

శ్రీ పేల్ కెలలో రైల్వేకూలిపనివాండ్ల మహాసభజరుగ గలదని ఆధ్యక్షతవహించుటకై మిస్టర్ యన్ యం. జ్యోషీ యం యల్ ఏ గారిని విన్నయించిరని ఇందులో బర్కతాని యాహింద్ఖీసెరుగూడా పాల్గొనగలరని తెలియుచున్నది

---

## సాధువు బావిలోపడుట

హైదరాబాదు (దక్కన్) ౧౯-౨-౩౫ — కొప్పల్ గ్రామములో ఒకసాధువు సుమారుకొద్దికాలక్రిందట ఒకబావిలో నాహారముకొరకై నీళ్లుతెచ్చుకొనుటకై వెళ్లిఅందులోపడి మరణించెను రక్షకభటులువారు విచారించగానిజము తెలిసినది. ఈసమాచారము నిజమనిశవపరీక్షవల్ల నిర్ణయముచేసినారని తెలియుచున్నది

---

## ప్రకటన

ఇందుమూలముగా అందరికి తెలియచేయుటయేమనగా సర్వేనెం 143- రు 158 —యకరముల పదకొండు గుంటలభూమి రామేశ్వరబండ గ్రామం స్టేషనులింగంపల్లినుండి 3 మైళ్లు పటాన్‌చెర్వునుండి 6 మైళ్లులోయున్నది. అందులో కాస్తుచేయదగినది య 62-35 గుంటలు ప్రతియకరంకు రు ౦-6-౦ చొ॥ ధారా యేర్పాటుఅయివున్నది. పైభూమికాస్తునిమత్తం ఒకసంవత్సరమునకుగాను 28 ఫర్వర్ది 1344 ఫ. రోజున సాయంత్రము 6 గంటలనుండి శివరాజబహదరు దేవిడిలో సేబా రామారాజు కాబడును. కాబట్టి కోరికదారులు పైతారీఖున పైస్థలమునకువచ్చి పాటపాడవచ్చును ఎక్కువపాటదార్ల పేరుమీద సేబారా ఖతంచేయబడును.

మోతెమదు కమిటీ
శివరాజబహద్దర్ యస్టేటు

---

## కడపటి వార్తలు

### హరిజన సేవక సమితి

కొందరి రాజీనామాలు

హైద్రాబాదు హరిజనసేవకసమితికియిపుడు అధ్యక్షులుగానుండు లక్ష్ నారాయణరెడ్డిగారును, ఉపాధ్యక్షపదవిలోనుండు మిస్ పద్మజా నాయుడుగారును కోశాధపతిగారును రాజీనామాలనిచ్చినట్లు తెలియుచున్నది

ఈసందర్భమున విచారించగా అఖిలభారత హరిజన సేవక సమితివారు యీమధ్యహరిజనసేవక సమితినిబంధనలలో కొన్నిమార్పులను చేసి వారనియు, యీక్రొత్తనిబంధనలలో తాను అధ్యక్షపదవిలోకంటె సాధారణసభ్యుడుగ నుండియె యెక్కువ హరిజనసేవకలనని యెంచి శ్రీ కొరరు నారాయణరెడ్డిగారు కేంద్రసంఘమువారికి తెలియజేసినరనియు తెలియుచున్నది తక్కినవారు తమపదవులనుండి విరమించుకొనవలచుటకు కారణమేమో నమ్మకముగ తెలియుటలేదు.

వీరందరు రాజీనామాల నిచ్చినమాట సత్యముకాదు. వీరు చాలించుకొనునప్పుడు క్రొత్తగా ఆపదవులలో యెవరు నియమింపబడవలెనో కేంద్రసంఘమువారికి సూచించువిషయము ఆలోచించుటకై ఫిబ్రవరి ౨౪వ తేది స్థానికసమితివారి కమిటీ జరుగగలదు.

---

## మః ఘః నిజాం సంస్థాన — రైల్వే

## ప్రకటన

౧౯౩౫లో భద్రాచలమందు శ్రీరామనవమి ఉత్సవసమయమున ప్రయాణికులకు

కన్సెషన్ రిటర్ను టిక్కెట్లు.

౧౯౩౫ ఏప్రిలు ౧వ తేదిమొదలుకొని ౧౨వ తేదివరకు, రెండురోజులుకలసి, యీరైల్వేలోభద్రాచలమునకుపోవు అన్ని రైయినులలోనుపోవు 3వతరగతి ప్రయాణీకులకు ౧ ప్రయాణమునకు అగు ఛార్జికేరానుపోనుకూడ పయోగించు నట్టిటిక్కెట్లు యీక్రిందిప్రకారము యివ్వబడును.—

తూర్పు బుకింగు.

ఈరైల్వేపై యేజంక్షనునుండిగాని భద్రాచలం రోడ్డుకును, అక్కడినుండితిరిగి ఆజంక్షనుకును.

లోకల్ బుకింగు

ఈరైల్వేపై ౧౦౦మైళ్లుదూరమునకు పైబడినదూరములోనుండు యేస్టేషనునుండిగాని. భద్రాచలంరోడ్డుకును అక్కడనుండి తిరిగిబయలుదేరిన చోటికిని.

నోటు.— ప్రయాణముచేయవలసిన దూరము ౧౦౦మైళ్లకంటె తక్కువైనపుడు పైతగ్గింపుఛార్జిప్రకారము ౧౦౦మైళ్లకుఅగుఛార్జి రానుపోనుసాధారణముగా అగుమొత్తముఛార్జికంటె తక్కువయగుపక్షమున, అదేప్రకారము ౧౦౧మైళ్లకు అగుతగ్గింపుఛార్జి చెల్లించిన, కన్సెషన్ రిటర్న్ టిక్కెట్లు యివ్వబడును.

౧౦౧మైళ్లకు తగ్గింపుఛార్జి రూ ౨-౧-౦

ఈరిటర్న్ టిక్కెట్లుకొన్నవారు ౧౯-౩౫ ఏప్రిలు ౨౮ అర్ధరాత్రిలోగా తిరిగివచ్చు ప్రయాణము పూర్తిచేయవచ్చును.

సికింద్రాబాదు (దక్కన్)
౧౮ ఫిబ్రవరి ౧౯౩౫

(ఆజ్ఞచేత)
చీఫ్‌కమర్షియల్ మేనేజరు

---

౨ వ పేజి తరువాయి

ములు ఈ ఆర్థిక వేత్తలు తెల్పుచుందురు. ఈనమ స్వదాహానలమై ప్రపంచమునంతయునలుముకొని పెట్టుబడిదారుల [Imperialists] యొక్కయు, వారిచేతయూరుకొబడిన ఆర్థిక వేత్తల యొక్కయు మనస్సునకలత చెందించుచున్నది, నడిసముద్రమున తుపానుకు చిక్కినసావవలే వారితెన్నుగానక అయోమయావస్థలో చిక్కి ధరలుతక్కువయగుటవలన ఆర్థికదుస్థితికలుగుచున్నదని యీ తిను పదార్థములు తగులబెట్టినగాని ధరలుపెరుగవని యీమొదలగు ఉన్మాదప్రలాపముల పలికించుచున్నది. ఒకదేశముతతగోధుమపంటను సముద్రములోపారవేసినటుల పత్రికాముఖమున తెలియుచున్నది

పాఠకమహాశయులారా? గమనింపుడు యంత్రమహాత్మ్యము. అన్న మోరామచంద్రయని కొన్నికోట్లకొలదిజనులు అలోచించుచుండ పండిన పంటలను సముద్రముపాలుచేయుదుర్బుద్ధిని పెట్టుబడిదారులకు (ధనికవర్గము) కలిగించిన యంత్రమహాత్మ్యమునుగమనించితిరా!

ఇటులయంత్రములవలన ప్రపంచముపొందుచున్న నష్టము నెన్ని యోగలవు. స్థలాభావముచే సంక్షిప్తముచేయవలసియున్నది.

రాట్నముపరిశ్రమగృహపరిశ్రమలలోకెల్ల ముఖ్యమైనది క్రమముగాగృహపరిశ్రమల అభివృద్ధికిజేసుకొనివచ్చినగాని నిరుద్యోగసమస్యనివారణకాదు గృహపరిశ్రమలు అభివృద్ధి చెందినగాని హిందూదేశము తానుమున్నన్నమను కనివినియెరుగనిక్షుభార్తుల ఆర్తనాదములడగదు. ధనికవర్గముయొక్కనిరంకుశాధికారమునకు గృహపరిశ్రమలు అంకుశమువంటివి. అస్వతంత్రజాతికి గృహపరిశ్రమలు స్వాతంత్ర్యమార్గమునకు రాచబాట.

కాన అతిథిపూజయందు దానధర్మముల యందుపేరెన్నికగన్న భారతదేశము దయాదాక్షిణ్యములకు పరోపకారబుద్ధికి పేరెన్నికగన్న భారతదేశం అహింసకుపుట్టినిల్లైన భారతదేశంలోతనపుత్రులునేను అన్న మోరామచంద్రయని విలపించుచుండ ఈవునురుయెవరికితగులునో గమనించితిరా! దేశదాస్యమునకుభవించుటకు దరిద్రస్థితిననుభవించుటకు ఈదీనులనిరాధారుల కంటినీరెకారణమనియురువకుము ప్రపంచముమాటయెటులున్నను యంత్రపరిశ్రమ హిందూదేశపరిస్థితులకుఎంతమాత్రమును తగదు! తగదు!! ముమ్మాటికి తగదు!!!

భుక్తిని, ముక్తిని, సుఖమును స్వాతంత్ర్యమును ప్రసాదించు గృహపరిశ్రమల చేపట్టుడు. ఆర్తనాదమునాలకించి దేశీయవస్త్రముల వస్త్రము లధరించి నిరుద్యోగసమస్యపోద్రోలి వృత్తివిభజన [Labourdistribution ] పునరుద్ధరించుడు. ఖద్దరుధరించనేడేబద్ధకంకణులుకండు. హిందూదేశమునందు హిందూప్రజలచే తయారగువస్త్రములనుతప్ప యుపయోగించమని శపథమూనుడు.

అవతారపురుషులకు పుట్టినిల్లనదగు భారతదేశమునందు అవతరించిన మహాత్మాగాంధిగారి "In having discovered Khaddar, I may well claim, to be the greatest Econamist of the age,, అను మహావాక్యమును సార్థకముచేయుడు.











గోలకొండపత్రికా ప్రచురములు

| | |
|---|---|
| ఉచ్ఛ్రల విషాదనాటకము | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-2-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| బమ్మెరపోతనామాత్యవిజయము (హరికథ) | 0-1-6 |
| రఘునాథ | 0-1-0 |
| చారుమీనారు | 0-1-0 |
| పంచముల చరిత్ర | 0-3-0 |
| హాలీకల్దారు జంత్రి | 0-2-0 |
| కాళ్ల కుబూలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రాంసరీనోట్లు ,, | 2-0-0 |

నోటు:—హిందువులపండుగల ప్రతులు ఖర్చైపోయినవి.

# నిలో మలేరియా అనుభవించినవారికి క్వైనాలో నమ్మకము పోయినది —



ఈ ప్రశంసా పత్రములను,

శిఫారసు జాబులను

చదువుడు

కేగాలేనుండి మలేరియా అంతకంతకు తగ్గుటపోయి ఆకస్మికముగా హెచ్చుటకు ప్రారంభమైనదని వార్త చేరినది. పోయిన మలేరియా మరల మరలవచ్చుచుండుటచే రోగులకు క్వైనాలో విశ్వాసము పోవు చున్నది.

(౧౯-౧-౩౯ నాటి 'టైమ్సు ఆఫ్ ఇండియా')

## ఏ విషయమున జూచినను యిది క్వైనాకంటె మంచి ఫలితము నిచ్చునది

దీర్ఘకాలము బాధించు చలువజ్వరములు, విడువక కాచుజ్వరములు—వీటిలో యెన్నిరకములుకలలో అన్నిరకములను అమీను ఆంటిమలేరియా గోలీలు నయముచేయును. ఈగోలీలు తప్పక నయముచేయును. వాటివలనకలుగుఫలితము స్థిరమైనదని ఋజువుచేయబడినది. ఎప్పటికినిఒకసీసా దగ్గర వుంచకొనుము.

ఈప్రత్యేకౌషధములో గులాంచా యెక్ట్రాక్టు, చిరేటాయెక్ట్రాక్టు, భాక్రీలీ యెక్ట్రాక్టు, కొన్నానామిసెనా, సింకోనారజ్, కాస్తు, యింకను యితర నిర్దోషములైన ఓషధులుచేర్పబడినవి. ఆర్సినిక్, స్ట్రిక్నైను, అకొనైటు మొదలగునవిదీనిలో చేరలేదు. క్వైనావల్ల చెవులుపుకట్లుటతప్పనిసరియైనవుడుయీ మాత్రలుమిక్కిలిప్రయోకరములు. స్త్రీలుగర్భవతులుగ నున్నపుడుగాని, ఋతుసంబంధ దోషములు గల్గియున్నపుడుగాని యీమాత్రలవాడవచ్చును. శిశువులకు బాలురకుకూడ వీనిని వాడుటవల్ల ప్రమాదము లేకుండుటయేగాక లాభము గలదు

### కిరిల్లా, సిలోను

నేను యీగోలీలను మలేరియాచే బాధపడుచుండిన కొందరు కూలీల కిచ్చితిని. చాల ఆశ్చర్యకరముగ అవి పనిచేసినవి; జ్వరము రెండు రోజులలో తగ్గినది.

మలేరియావల్ల బాధ పడువాడెవడు నాకు కనిపించినను నేనతనికియీ మాత్రలను శిఫారసుచేయగలను.

సూపరింటెండెంటు
తాలాగహాహెనా యస్టేటు

బీహార్ సెంట్రల్ రిలీఫ్ కమిటీ
(మెడికల్ డిపార్టుమెంటు)
మోతిహారి

"మీరు బీహారుసెంట్రల్ రిలీఫ్ కమిటీయొక్క వైద్యశాఖకు మీ అంటిమలేరియాగుళికలను కావలసినన్ని యిచ్చియుంసిరి. నానహాయకులు వాటిని ఉచితముగా పంచిపెట్టిరి. నేనున్న మలేరియాతగిలినవారికి వాటినిచ్చితిని. అనేకరోగుల విషయములో యీ మాత్రలవల్ల తీక్ష్ణజ్వరములున్న, అంతర్గత జ్వరములున్న తగులుచుండుట మూడు రోజులలో నిలిచిపోయెను. దీర్ఘకాలమునుండియున్న మలేరియాకు కూడ యీ మాత్రలవల్ల నయము కనపడెను." "నాకుయీగోలీలవల్ల సంపూర్ణ సంతృప్తి కలిగినది."

యం.బి.బి.యస్. (బొంబాయి)
డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరు.

బొంబాయి

"నేను మీ అంటిమలేరియా గోలీలను వాడిచూచినాను, మంచి ఫలిత మొకగ్గినది. మీ బిల్లుతో కూడా యీజాబు మీకందించు వానిచేతికి మరి మూడు సీసాల నిచ్చి పంపుడు.

యల్.ఆర్.సి.పి. (లండన్)
యం.ఆర్.సి.యస్. (ఇంగ్లాండ్)

హైదాబాదు మునిసిపాలిటీ

"ఈ శాఖోద్యోగులు అమీను ఆంటిమలేరియాగోలీలను పంచిపెట్టి, ఉపయోగించి చూచినారు. మంచిగా పనిచేసినవి.

మునిసిపల్ కమిషనరుకుబదులు
అఫ్సర్ నవాజ్ జంగ్

పాలీక్లినిక్, (హాస్పిటల్)
బొంబాయి

"నేను ముజఫర్పూరుజిల్లాలో బీహారు సెంట్రల్ రిలీఫ్ కమిటీయొక్క మెడికల్ ఆఫీసరుగా పనిచేయుచున్నపుడు మీఅంటిమలేరియాగోలీను ఉపయోగించగా మంచిఫలితకనబడెను.

మలేరియాతో బాధపడువాడెవడైనను నాకుకనబడిననేనతనికి యీమాత్రలను వాడుటకు గట్టిగశిఫారసుచేయగలను." యం.బి.బి. యస్.

## అమీను ఆంటిమలేరియా గోలీలు



### గోల్డుమెడలు

౧౯౩౮ వ సం॥పు ఎచ్. ఓ. ఎచ్. ఫీట్ కమిటీవారు అమీన్సు స్పెసిఫిక్సుకుగాను యిచ్చిన మొదటితరగతి విలువ పతకము.

ఆబు హైస్కూలు,
మౌంటు ఆబు.

"మీ అంటిమలేరియా గోలీలు అమితాశ్చర్యకరముగానున్నవి"

మెసర్సు, జి. హెచ్. హావి

ఏ. అమీన్ అండుకో
౧౧౪, క్లైవ్ రోడ్డు, కార్నాక్ బందర్,
బొంబాయి 3.
టెలిఫోనునెం. ౨౦౭౧౧, ...

బెల్గ్రాం "ఆంటిక్వినిన్"

బ్రాంచి:— యూక్సెల్సియర్ బిల్డింగు, హైదాబాద్, దక్కన్

బెంగాలు, బీహారు, ఒరిస్సా, అస్సాములకు చీఫు యేజంట్లు
మెసర్సు గాంగ్లీ సాహాఅండ్ కో., ౧౧, య్యాబ్స్ట్రీట్, కలకత్తా

అందరు ప్రసిద్ధులగు కెమిస్టులవద్ద దొరుకును.

ఈ ఉచితనమూనా క్రైవా యుడు



దక్షిణను, ఫ్యాక్టరీలు ... ధర్మసంస్థలకు ... ౧౦౦ గోలీలనమూనాలు ఉచితముగాపంపబడును. టపాచార్జీలకు గాను ఏ అమీన్ అండుకో, బొంబాయి ౩ అనుఅడ్రసుకు ... టిక్కెట్లు పంపుడు.

౧౦౦ గోలీలగల ... (ప్యాకింగుచార్జి, టపాచార్జీలు ... అంతకంటెయొక్కువసీసాలు ... ప్యాకింగుటపాచార్జీలు పడవు.

REG. No N. 45

Reg No M. 2165




23

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy